సంధ్యా

# సౌమిత్రి

*

గా ది రా జు

వేంకట రమణయ్య

ఎం. ఏ.

# పండితాభిప్రాయములు



MAHARAJA
of
Jeypore

Fort,
Jeypore (Orissa)
8-5-1946.

## ఆశయము

విద్వాన్ శ్రీ గాడిరాజు వేంకటరమణయ్య, ఎం. ఏ. గారు "స్వప్నకుమారము" నకుఁ బ్రతిపద్య ప్రతిపదార్థ - తాత్పర్య - వ్యాఖ్యలను రచియించి, ఆ పుస్తకముయొక్క పద్యములను బ్రకాశింపం జేసి పాఠకులకు సుఖబోధ మొనరించిరి. కనుక వారి పరిశ్రమము ప్రశంసనీయము.

.............................

మహాశయా, మీ సంధ్యాసౌమిత్రియందలి పద్యములు మృదుపద యుక్తములై ధారాశుద్ధిగలిగి యున్నవి......

సం. విక్రమ దేవవర్మ.



Sri Viswanatha
Satya Narayana Garu, M.A.,
Lecturer in Telugu,
S.R. R. College, Bezwada.

బెజవాడ,
29-3-1946.

ఆర్యా,

తమ స్వప్నకుమార సమీక్షయు, సంధ్యాసౌమిత్రియు రెండును చూచినాను. మీ విమర్శ పాటవము, కవితాశక్తియు రెండును నన్ను ఆనందపరచినవి. శ్రీ పింగళివారి శిష్యులగుటయే చాలు. తమ సాహిత్య శక్తి చక్కనిమార్గమున నున్నది. పరమేశ్వరుడు తమచేత నితరకృతులు వ్రాయించి, మీకు ధన, యశ, ఆయురారోగ్యములు కూర్చుగాక.

విశ్వనాథ సత్యనారాయణ.

—oo:o:oo—

శ్రీరాజా పార్థసారథి నాయనింగారు
**Rajah of Panagal**

భావోద్రేకము గొలుపన్
గావేనల పలుకులగమి కావ్యంబగునే,
ప్రోవుగ సున్నము రాలున్
వైవనె యిల్లగునె తగునె వసియింపంగన్.

శ్రీగాదిరాజు వేఙ్కటరమణయ్యగారి కనేక వందనములు :—

కవివరా,

మీరు ప్రీతితోఁ బంపిన "సంధ్యా సౌమిత్రి" యను కావ్యమును జూచినాను, గడవఱకు నుల్లాసముతోఁ జదివినాను. రసవంతము గా నున్నది. చదువవలెనను నుత్సాహమును బుట్టించుచున్నది.

వర్ణనములలో నందఱు నవలంబించు పద్ధతులను విడిచి నూతన మార్గము నవలంబించినారు. చక్కఁగా నున్నది. అయినఁ గొన్ని చోటులమాత్రము మిక్కిలి నవ్వించుచున్నది, గాని, విషయ గాంభీర్యమునకుఁ గొంత కుందక మగుచున్నది.

వ్రాఁతకాఁడు తాను వర్ణింపఁబూనిన భావములను, దనపలుకులఁ గూర్చి వేరవరి తనమువలనఁ జదువరుల మనసులందును దన మనసునందున్నట్లే కనుపింపఁ జేయఁగలిగి నంతట నట్టివ్రాఁతకాఁడే కవి, అట్టి వ్రాఁతయే కవిత్వము. మీ సంధ్యాసౌమిత్రి అట్టి కావ్యములలో నొక్కటియని నాకుఁ దోఁచినది.

శైలి రమ్యముగా నున్నది. పద్యములందు భావములు కూరిపోసినట్లున్నవి. సంస్కృతపదములు కొంత ఎక్కువగా నున్ననుఁ గష్టమును గలిగించు దీర్ఘసమాసములు మిక్కుటముగా లేవందువ నడకకు భంగము కలుగక సగళముగా నున్నది.

పానగల్ మహల్, పానగల్లుపోస్టు,
చిత్తూరుజిల్లా, తే. ౩౦-౫-౪౬. } హ. పార్థసారథి రావు.

—ooo—

## సాహితీ సమితి.

సభాపతి,
శ్రీ శివశంకర శాస్త్రిగారు

వీరభద్రాపురం,
రాజమహేంద్రవరము.
15-8-1946.

మిత్రులు వెంకటరమణయ్యాగారికి,
ఆశీర్వచనములు. ఉభయకుశలోపరి.—

మీరు "స్వప్నకుమార స్వరూప సందర్శనము" వ్రాసినట్టు రెండు మాసాలకిందట విన్నాను. నా పేర మీరు పంపినపుస్తకము

నిన్ననే గుంటూరులో చూచి చదివినాను. శ్రీ సుబ్బారాయ భట్టాచార్యుని కావ్యమును మీరు చాలా బాగా వివరించారు, రచనా విధానము విద్యార్థులకే కాక విద్వాంసులకు కూడా ఉపయోగకారి, స్వప్న కుమార నామ నిర్వచనమును బట్టి మీకు సాహిత్యాచార్య కత్వము సంక్రమించిందని సంభావిస్తాను. సింహావలోకనము కింద చిన్న వ్యాసము కూడా చేర్చి ఉంటే సంపూర్తి అయ్యేది. మీరు కావ్య సమీక్షలు చేసి స్వారస్యము ఆంధ్ర సహృదయులకు అందించాలి.

..............................

"సంధ్యాసౌమిత్రి, చాలా బాగా ఉన్నది. పద్యాలలో ధార, నడక, ఇంపుగా నున్నది. ౧౬౦ పద్యాలలో సత్తువలేని పద్యము ఒకటీ లేదు. కావ్యములోని వ్యాజనింద హృద్యము. మీరు రామాయణము బాగా పఠించినట్లు కనిపిస్తుంది. ఇక మీరు దీర్ఘ కావ్య రచనకు పూనుకోవచ్చును.

..............................

ఇతి శివమ్. శివశంకర శాస్త్రి.

—ంంఊంం—

Sri Challa Satya Narayana Garu, M.A.

Lecturer in Telugu, Loyola College, Madras.

శ్రీ గాడిరాజు వేంకటమణయ్యగారికి నమస్కారములు.—

ఆర్యా,

తాము రచించిన "సంధ్యా సౌమిత్రి" కావ్యమును పూర్తిగా పఠించితిని. శైలి మృదుమధురమై ధారాశుద్ధి కలిగియున్నది. ఉత్తర

రామాయణ కథను నూతన ఫక్కిలో సంగ్రహముగాను హృదయంగ మముగాను రచియించుటలో మీ కవితానైపుణ్యము కొనియాడదగి యున్నది. మీకు ఆంధ్రకవిలోకమున మహోన్నత భావి కలదని నా నమ్మకము.

ఇట్లు,

14-4-1946 } చెన్నపురి. }

చల్లా సత్యనారాయణ,
ఆంధ్రోపన్యాసకుడు, లయోలా కళాశాల.

—oo:o:oo—

పిల్లలమఱ్ఱి
వేంకట హనుమంతరావు, ఎం.ఏ.
శారదా పీఠము

89, B. నాంపల్లి,
హైదరాబాదు (డక్కన్)
28 మే, 1946.

ఆర్యమిత్రులకు అభివందనములు.

మీరు పంపిన "సంధ్యా సౌమిత్రి" యను చిన్నకావ్యమును సోత్సాహముతో చదివితిని. మీ కవితా ప్రతిభను మెచ్చితిని. కవితా రచనమందలి ధార నన్ను తుదముట్టనేకబిగిని చదివించినది. మీ సీసములు మీ ఖండకావ్యమునకు ప్రబంధశోభ ఘటించినవి. నారద దుర్వాసుల కలహము, కౌశిక గోత్రజుడనైన నాకు ముచ్చటగా నున్న దనిన వేఱుగా ప్రశంసింప నక్కరలేదుగదా.

"మాడినదయ్యా"—"త్రోవనుబోవలేరు"—"వెఱ్ఱిబాగుల వాఁడ"—"నిన్నగాక మొన్న"—"కల్లా కపటములు"—"గంద రగోళము"—"చూచి రమ్మటన్న కాల్చివచ్చుట" మొదలైన జాతీయములు మీ కావ్యమునకు వన్నెగూర్చినవి. "అరరే మంథర గర్భ

మైనఁ జొరవయ్యా కొంత మేలయ్యెడిన్" "కామ బీజమ్ములు సంద డింప సహజమ్ముగ బుద్ధులు సన్నగిల్లవే. "విపరీత ప్రతికార్య ధుర్యుల కటా విద్వేషిణుల్ మానినుల్" మొదలైన అర్థాంతరన్యాసాలంకార ములు రసోపస్కారకములుగా గన్పట్టుచున్నవి.

లక్ష్మణునిగూర్చిన భావములు, రావణునిగూర్చిన సార్థక వాక్యములు—అవతార తత్త్వవివరణము, మీ భావదీప్తిని ప్రదర్శించుచున్నవి. మీ ఖండకావ్యమును జదివినపుడు నాకు తోచిన రెండు ముక్కలను వ్రాసితిని.

మీ రింకను రసవత్కావ్యముల రచియింతురుగాత మని కోరుచున్నాను.

ఇట్లు,

పి. వెం. హనుమంతరావు.



Printed at The Liberty Press, Madras—Q. H. M.S. 499
for C. Subbiah Chetty & Co., Q. H. M. S. 121-B, Nov. 1946

# తొలిమాట



నే నిటీవల రాయవెల్లూరుకు దక్షిణభారత ప్రయోజన విద్యా సమ్మేళనము సందర్భమున వెళ్ళితిని. శ్రీ గాదిరాజు వేంకటరమణయ్య ఎం. ఏ. గారచట నన్ను కలిసికొనిరి. వ్యక్తిగతంగా తమ నేమాత్రము నెరుంగని నేను, ఏనాడో తాను వ్రాసిన భోజుడను చిరుకావ్యమును హిందూపత్రికలో సమర్శింప తమ కేదో యుపకార మైనదనియు, తాము వ్రాసిన యీ సంధ్యాసౌమిత్రికి నాచేత తొలినుడి వ్రాయించుకొనుటకు వేచియుంటిమనియు వాత్సల్యమున సెలవిచ్చిరి. ఈ చిన్నరచనను వారి చేతనే చదివించి వినసెంచితిని గాని అవకాశ ముండలేను. వీరు యువకులు. యువకులే మంచిపనిచేసి అందులో నేతోడ్పాటు కోరినా కాదను ప్రకృతి నాదికాదు. కావున ఈ చిరుకావ్యమునకు తొలిమాట వ్రాసి యుండని వారు కోరిన కోరికను త్రోసివేయలేకపోతిని.

> "త్యాగమె జీవనమ్ము పర
>
> తంత్రము నన్నిజయోషితా పరి
>
> త్యాగమె భోగమై తనరు
>
> దాశరథీశుపదార్చమాత్ర సం
>
> భాగుడు లక్ష్మణుండు"

ఇది శ్రీ గాదిరాజు వేంకటరమణయ్యగారు తీర్చిదలచిన లక్ష్మణుని శీలము. ధాత్రీమహాదేవిచేతనూ, వసిష్ఠుపత్ని చేతనూ, మునుల చేతనూ, వీరు, ఈశీలవర్ణనము చేయించినారు. ధాత్రీమహాదేవియు వసిష్ఠపత్నియు స్త్రీలు గాన వారిచేత వక్రోక్తులు పల్కించినారు. దుఃఖమున వివేచన యుండ దనుట నిరూపించుటకో యన జనకుని శ్రీరాముని తూలనాడించినారు.

శ్రీరాము డవతారము చాలించి శ్రీ కృష్ణావతారమగు సంధిలో లక్ష్మణుడు కడపటి కఠోరపరీక్షకు పాలగుట ఈ కథకు బీజము. అదియే లక్ష్మణునకును కడపటికాలము.

"విష్ణుసేవచేసి విశ్వమే త్యజియించె
భౌతికమ్ము మరచి బ్రహ్మ మెరిగె
రామగాథ నడపె రామానుజుండౌర
సహనమొండె యాత్మశక్తిగాగ."

సహనమొండె యనుటకంటె, శాంతియొండె యనిన నేటి మహోత్తేజకర యుగసూచనముకూడ నయియుండునేమో. ఎట్లయినను నాడు సంధియే. నేడును సంధియే. తనమేలెంచక రామగాథ నడిపెడు రామానుజుడు నాడవసరమైనట్లే రామరాజ్యసాధనచేయుటకై తను మేలెంచక రామరాజ్యగాథ నడపెడు రామానుజులు నేడును కావలసియున్నారు. కాబట్టి "సంధ్యాసౌమిత్రి" సమయానుకూలము.

శ్రీ వేంకటరమణయ్యగారికి చక్కని ధారాశుద్ధి కలదు. వీరీగాథ నింకనూ సరళముగా జానుతెనుంగున గానయోగ్యమగు దేశిరచనలో వెలయించిన చాల మేలగునని నా నమ్మకము.

మదరాసు
17-3-1946.

గాడిచెర్ల హరిసర్వోత్తమరావు

## స్తుతి

॥ ఎంతున్ సకలాంధ్ర కళా
కాంతున్ మమగురు పదాగ్రగణ్యుం గవితా
కాంతున్ బింగలి లక్ష్మీ
కాంతున్ బహుళేప్సితార్థ కల్పకు బ్రీతిన్.

## కృతి

॥ రాజులు లేరు నీవు మధు
ర ప్రియ భాషల నాలకించి నీ
తేజము చూచి, కానుకలిడి,
దివ్యకళా పరిపూర్ణ నంచు నీ
రాజనముల్ దలిర్పఁ గృతి
రాజ్ఞ! ప్రదోషమె పెండ్లి కామి? నీ
మోజులు తీరవా, వయసు
బోయిన కన్యలు కారె యెల్లరున్ !

# నమస్క్రియ

శ్రీ లక్ష్మీ ప్రియభావ వర్తక శుభ
క్రీడా విలాసుండు వి
ద్యాలంకారుఁడ గాధ నీలగళు హృ
ద్యాకాశ రూపుండు మి
థ్యాలోకాయతన ప్రశస్యకుఁడు వి
ద్యా, వేత్తృ, వేద్యుండు త
ల్లీలా కల్పుఁ డనంతుఁ డొండె మము పా
లింపంగ నర్థించెదన్ !

సంధ్యా

# సావిత్రి



అప్పుడది భానువారమట
నస్తగిరింబడుచుండె సూర్యుఁడా
తపము నశించి చల్లవడె
ధారణికన్నులు రాహుకాల మం
చపుడపుడే మునీశులు ఘ
నాధ్వరసూక్తులఁబాడి సంధ్యలన్
జపతపముల్ పొనర్చిరి ప్ర
శాంతముగా సవితృప్రవృద్ధికై !

౨

తలపంకించెను ధాత్రి పుత్రియగు సీ
తాదేవి కష్టమ్ములం
దలఁచెన్, సూర్యకులమ్ము వారి దయయున్
దాక్షిణ్యమున్ వేయినో
ఖలఁజేర్గాఁచు శపింపఁగాఁదొడఁగెఁ త్రై
లోక్యప్రభున్ రాముని
దలఁచెన్ శత్రుఁడఁటంచు భార్యహితల
త్రల్ గాలి ఘోడల్ గదా!

3

ఇనవంశోత్తముఁడంట రాముఁడెవఁడో
యిక్ష్వాకు సత్కీర్తికిన్
ఘనతన్ దెచ్చిన దైవమౌనఁట తనిం
గాంక్షించి పూజించి నా
జనయిత్రిం దను ధారవోసె నృపుఁడై
సన్న్యాసి వేషమ్మునన్
జనకుండింతలు నేర్చునే యనుచు నా
సాధ్వీలలామంబనున్.

౮

॥ అడవుల కేగునాఁడు వల
దంచు సుతం గయికోవు పోయెఁబో
దడవుల పిచ్చితల్లి దయ
దప్పని శాటున కప్పగింపఁగా
నడుగవు పుణ్యసాధ్వి నటు
లగ్ని పరీక్షలఁ బెట్టనోర్చితో
జడమతి, నీవు తండ్రివటె,
జానకికిం జనకుండ వీవటే !

౯

॥ కొమరులఁ గన్న తండ్రి యమ
గో రఘురాములఁ గన్న తండ్రి నీ
వమువున బిడ్డఁ గోలుపడి
వంకర టింకర తాత్త్వికోక్తులన్
నుడువఁడు; వియ్యమందితివి
నువ్వులు బియ్యముఁ గూడునట్లుపో
కడుపునఁ గన్న రోషమది
కల్గునె బిడ్డలు లేని వారికిన్ !

౬

॥ చేలో దక్కకె నష్టమై దొరకె నీ
సీతా మహాలక్ష్మి యిం
కేలా ? చెట్టునఁ గోసినట్టి ఫల మ
య్యెన్ నీకు మూన్నాళ్ళలో
బాలన్ రాముని కంటఁగట్టితివి నీ
భారంబు శాంతింపఁగాఁ
జాలుంజాలును గొంతు గోయఁగల వా
త్సల్యమ్ము నీదే సుమీ !

౭

॥ చదివితి వంట వేదముల
శాస్త్రములన్ దలక్రిందు చేయనే
ర్పిదముగ నేర్చినావఁట ప్ర
వృత్తి నివృత్తి విధాలఁ దత్త్వముల్
తుది మొదలంటి పిండఁగల
దార్ఢ్యపు భూతదయా విశిష్టతన్
ముదితనొకర్తఁ గాచికొను పుణ్యము
నందకపోయి తక్కటా !

౮

॥ అనుచుం గ్రోధముతోడ ధాత్రి మది న
త్యంతమ్ము దుఃఖించుచున్
జనకుం దూఱుచు రాఘవుం దలంచుచున్
జన్మాంతర ప్రాప్తిక
ర్మను దూషించుచుం గర్మసాక్షి పతనా
రంభమ్ము కాంక్షించెనో
యనఁగా నొల్లున కేక వెట్టెఁ బరమే
శాయంచుం గంపించుచున్.

౯

॥ ఆరయ ముల్లోకమ్ముల
నారాయణు పరమదివ్య నామస్మరణో
ద్ధారకుఁడై చరియించెడు
నారదముని ధాత్రి యార్తనాదము వినియెన్.

౧౦

॥ వినినంతన్ భువనత్రయ క్రియలు భా
వించెన్ మహాపూజ్యుఁ డా
జనకుంగూర్చి ధరిత్రి పల్కువిధముల్
సామాన్యమై తోఁపఁగా

వినతిఁ శ్రీహరి దిక్కుఁసూచి పలికెఁ
విశ్వేశ! నీసృష్టియై
నిను దూఱం దొరకొన్నదీ ధరణి
పాండిత్యంబు దర్పింపవే!

౧౧

1 జనకుండుత్తమ సాత్త్వికుండు గురుని
ష్ఠుఁ వేదవేదాంగ ద
ర్శన పారంగతుఁడై నిజంబెఱిఁగి ధీ
సంపత్తిచే నందతే
మునులఁ శిష్యులఁ గాఁగ నేలిన మహా
పూజ్యుండు భూదేవికిం
గనుపట్టంగతమేమి యుట్టులివెకా
కాంతా ప్రమాపద్ధతుల్.

౧౨

1 సౌందర్యమ్ము విలాస సంపదయు ధీ
సంపత్తి జ్ఞానార్జి తా
నంద స్ఫూర్తియు నద్ది యిద్ది యనసె"
సా సర్వశోభా గుణా

నందాలంకృతఁజేసితీ కపట కా
న్తా రూపమున్ దేవ, నీ
యందే భేదముసాఁపు మోక్షగతిదా
నాక్షేపముల్ సేయుచున్,

౧౩

॥ ఏమి విచిత్రమయ్యె పర
మేశ, గుణత్రయ రాశికీ గతిన్
గామము నర్థముం గలిపి
కాంతనో నర్చుచుఁ బాంచభౌతిక
గ్రామమె భూమిసేసితివి
కామినియైన ధరిత్రి నిన్నుఁ కన్
సామము లోర్వనిచ్చునె? వి
షాదజముల్ రమణీ మనోగతుల్ !

౧౪

॥ ఒక నీకియ్యది యాటకాఁదగునో యే
మో కాని మా జీవముల్
ముకుర ద్యోతిత బింబముల్ క్షణికమౌ
ముల్లోకవుం బొందు; పి

ల్లికిఁ "జెల్లాటమె" యెల్ల కేమగుని' వే
తే చెప్పఁగాఁజాల నీ
వికటత్వంబిఁకమాని ప్రోవఁగదవే
విశ్వేశ విశ్వంభరా!

౧౫

॥ మనసున శాంతి గూర్పకయె
మానవకోటి సృజింపనేల, భో
జన మిడ లేనితండ్రి కెక
నక్కఱపు బిడ్డలు కోఁబలేల, ప్రీ
తిని గనవయ్య దేవ, జగ
తీ వర, లోకపుటాశ దీర్పవో
"కనక సభాపతీ" పరమ కారుణికుండవు
నీవు శంకరా!

౧౬

॥ త్రేతాంతమ్మిది నీవు వచ్చిన పనుల్
దీరెన్, ధరన్ రాక్షసో
త్పాతమ్ముల్ నశియించె నాటకమునన్
బాత్రల్ గదా ధీరులీ

సీతా లక్ష్మణులెల్లలోని కరుగన్
శేషించవే శేషివై
తాతా, శేషశయాన, పాలకడలిం
దర్శింపమే శ్రీపతీ!

౧౭

॥ అని శ్రీహరిఁ బేర్కొని రా
మునిఁగాంచ నయోధ్యకేగు మోదము కలుగన్
జనుదెంచుచు మార్గమ్మునఁ
గనె గంగాతీరమందుఁ గపట యతీశున్.

౧౮

॥ గంగలో స్నానంబు గావించి మేనెల్ల
భస్మంబు మువ్వాఁత పట్లు వెట్టి,
ఆదిత్యుఁ బోషింప నర్ఘ్యమ్ములందిచ్చి
మందేహులం బాప సందె వార్చి
కనువిచ్చి కనుమూసి కలిమిలేములుగాంచి
యశ్వత్థ దండమ్మునర్చ చేసి,
శివుఁడే భవుండంచు భవుఁడె శివుండంచుఁ
దార్కాణములతోడఁ దట్టిచెప్పి

॥ బ్రహ్మచారులు పదిమంది భ్రాంతి తోడఁ
జుట్టు కై సేసి కొలువఁగ దిట్టఁడగుచు
ధ్యానమును బూని యా మౌని కానుపించె
నాకమునుండి డిగివచ్చు నారదునకు.

౧౯

॥ పాముంజూచిన కప్ప "స
లాములు" ఁజేయెత్తి పలుకులాగున, సింగం
బామోదింపఁగ మ్రొక్కెడు
గోమాయువుఁబోలె బ్రహ్మ కొమరుఁడు పల్కెఁ.

౨౦

॥ అనసూయా ప్రియపుత్ర, శర్వగత వి
ద్యా వైభవోల్లాస, స
ద్వినయస్ఫూర్తివి శాంతమూర్తివి దయా
విన్యస్త సన్యస్త కాం
చన, కౌమారివి, సత్పవిత్రుఁడవు
దీక్షా, రుద్రతేజంబునన్,
జననంబందితి వీవు మిత్రులయెడన్
సఖ్యంబు వోనాడెదే!

౨౧

॥ పిలిచినఁ బలుకవదేటికి ?
పలుకంగా రానియంత పగవాఁడనొకో
తలయెత్తవేమి జపమో
సలుపంగా నేర్తుఁగొంగ జపములనేనున్.

౨౨

॥ అనవిని యస్సురస్సురని
హాయని హాయని కన్నువిప్పినా
ముని, పదికోట్ల జీవము య
ముంగనఁ బోయెను భస్మరాశియై
వెనుకని నిల్చె నారదుఁడు,
వేడుకొనెం దనవంకఁ జూడరా
దని నుదురంటి క్షోణితల
మాముని పుంగవుఁ జూచి మ్రొక్కెనన్.

౨౩

॥ పకపక నవ్వె, నారదుఁడు,
బ్రహ్మసుతుండవు దైవభక్తికిన్
మకుటమ వీవు, మమ్ముగని
మ్రాన్పడి నట్లు నటించుటెల్ల మ

మ్మొక పరిహాస పాత్రముగ
నొప్పరి కించుటగాదె కానిచో
సకల గుణమ్ములుం గలుగు
శర్వుఁడనంచు వచింతువా మునీ!

౨౮

॥ మీవలెఁ దగవులఁ బెంపఁగ
నావుల లేఁగలకు మారణంబు సేయున్
మావంటి వారి కగునా
కావఁగ లేకున్న మానెఁ గలఁతల బెంపన్.

౨౯

॥ అనఁగా నారదుఁ డంతలోఁ దలఁచె నీ
రా జర్షి చిత్తంబునన్
గనుగొంటిన్ భువి నేఁడు తోడ నితనిన్
గల్మాష చిత్తున్ మునిన్ ;
ఇనవంశమ్మునకున్ శుభంబగుత నా
యిక్ష్వాకు వంశాబ్ధి చం
ద్రునకున్ మేలగుఁగాత; పోఁడుగద యీ
దుర్మానుఁ డచ్చోటికిన్ ;

౨౬

॥ దినమణి వంశమందిపు డ
తీవదురాసదముల్ చెలంగ దు
ర్దినములు వచ్చె నొక్కెడ స
తీవిరహార్తుఁడు రామమూర్తికిన్
దినములుబాగుగావు; చేను
దేఱుఁడుగా రఘురాము పాలికీ
ముని, కఠినుండు శాపమిడఁ
బోవఁడు గా, యనుకొంచుఁ జెచ్చెరన్.

౨౭

॥ మనసాక వీథికిఁ జనఁగా
జనవొప్పఁగఁ బలికెనిట్లు, సఖుఁడా మిూలా
గున శాపమ్ముల నీయఁగ
ననువగునే తపములేని యతులకు మాకున్.

౨౮

॥ బలితమ్ముగఁ జేయుతపః
ఫలమటు వ్యర్థమ్ముగాఁగఁ బాపపు శాపం
బులఁ గోల్పోయెద రే యనఁ
దలితముగా నొకరి నొకరు దూల్కొనిరిటులన్.

౨౯

॥ జరిపించితివి మేలు సావిత్రి పెండ్లి పౌ
రోహిత్య కార్యనిర్వాహకుఁడవు;
తుష్టిన్ శకుంతలా దుష్యంత దంపతీ
సాంగత్య మోర్చిన సరసమతివి;
బ్రహ్మలోకోదంత భారగర్భుండవై
కూజన మొనరించు కోకిలమవు;
అంబరీషునకు మే లతిథివై ద్వాదశీ
వ్రతము రక్షించు సద్బ్రాహ్మణుఁడవు;

॥ నీవు రక్షించినట్టి మనీషులెల్లఁ
గాలు నాతిథ్య మందఁబోఁ జాలినారు
నీవు పోషింప వర్ధిల్లు జీవకోటి
యల్లదే భస్మరాశియై యలరుచుండె.

౩౦

॥ అని యిట్లొండొరులం బే
ర్కొని కయ్యము లాడువేళ రుద్రబ్రహ్మల్
మొనకొని నట్లుగఁ దోఁచెను
మునిజనములు తల్లడిల్లి మొఱఁగులు వెట్టన్.

---

౩౧

॥ మూఁడిన దయ్యాల్నీ కన
మూఁడక యింకేమి కలదు మూఁడిన దంచున్
దాఁడిం దాడిం దాఁకుచుఁ
బోఁడిమిఁ బోనాడి మునులు పోరాడు నెడన్.

౩౨

॥ నవ్వెరి మింట దేవతలు
నారదుఁడే కలహాసఁజిక్కె మా
యవ్వలు తాతలుం దగవు
లాడుకొనం జనుహేతు; వీతఁడే
కవ్వము లిండు చేతులకుఁ
గట్టలనిండు తపస్వులార యిం
కెవ్వరి జోలికేగరు ము
నీశ్వరు లిద్దరు బుద్ధి వచ్చినన్.

౩౩

॥ దైవమొ మాకుఁ దండ్రి యని
దంభము లాడుచు మూఁడులోకముల్
చావులఁ దేల్చుచుండు రెక
సక్కెముగాఁగ గజేంద్రుఁబోలు స

---

త్పావన శీలు రెండఱఁ గృ
పామతి సుందులవోలెఁ గాచిరో
త్రోవను బోవ లేరొకని
దూషణసేయక తాపసోత్తముల్.

౩౮

॥ సార్థకనాముం డసాధువర్తనుఁడు వి
శ్వామిత్రుఁ డొక్కండు సాటిగాఁగ
వారాశిఁ దిగఁద్రావి వాతాపిమ్రింగు
నసాధ్యుం డగస్త్యుండు సాటిగాఁగ
నిటలాక్షు నోడించి నటులఁ బాదాహతుఁడై
శాంతించు భృగువొండె సాటిగాఁగ
సాగరేయుల నెల్లఁ జల్లఁగా రక్షించు
సాధువా కపిలుండు సాటిగాఁగ

॥ తాపసులమంచు నింతింత దాఁడిఁ బెంచి
శాపములఁ గోలుపడి తపశ్శక్తు లెల్లఁ
దిరుగుచున్నారు వీరు యతీశులంట
శాంత మెఱుఁగని సంసార సాగరమున.

౩౫

॥ రావణ కుంభకర్ణులను
రత్వము సెందియు భక్తిసేయరే
పావనమూర్తి శంకరుని
పాదములంటి భజింపరే ధరన్
శైవులనెల్ల రాక్షసులఁ
జల్పిన పూజ్యుఁ డెవండొ యీ మునుల్
దేవుని పేరఁ జేసెడు న
ధిక్రియలెల్ల సమంజసమ్ములే!

౩౬

॥ రాముని రాజ్యమందలి ధ
రామర కోటులకెల్లఁ బూజ్యుఁడ
స్తోమగుణప్రసిద్ధుఁ డతి
శుద్ధ చరిత్రుఁ డరుంధతీ సతీ
స్వామి వసిష్ఠుఁ డొక్కఁడె ని
జంబగు సాధుతపస్వి వానితో
నీ మునికోటిఁ బోల్పఁదగు
నే వినియుంటిమె వానిశాపముల్.

౩౭

॥ కామాది రిపువర్గ గాఢానువర్తులై
త్రిగుణంబులే మనఃక్రియలుగాఁగ,
ఈషణత్రయజాత దోషప్రభూతముల్
రోషోక్తులే వాక్యరచులుగాఁగ,
బహుజన్మకృతపాప పర్వతగ్లాని యా
పవిమె శ్రీహరిఁగొల్చు భక్తిగాఁగ,
సమయోచితజ్ఞాన సంజాత ధర్మవి
చక్షణతయె యాత్మశక్తిగాఁగ,

॥ ఒందు నొందు తెలుంగున నొప్పుచుంద్రు
మునులు రాక్షసులేకైక పుణ్యవృత్తిఁ
గాకపోయిన నిష్కామ కర్మమెందు
మునుల కిప్పించునేమొ యామోక్షపదము!

౩౮

॥ వరములఁ గోరరాదకట,
వంచనసేయఁగ రాదు దైవమున్
సురుచిరమైన భక్తిని త్రి
శుద్ధిగ సల్పిన వారికెన్నఁడున్

బరమపదంబు భద్రమగు;
పాపము సేయఁగనేల ధాత్రిపై
నరులయి పుట్టి యీ ఋషుల
నాల్కల నమ్మి నశింపనేకదా!

౩౯

॥ అనుచుం దేవత లాలకించు నెడ "నా
హా లక్ష్మణా, లక్ష్మణా"
యను నార్తధ్వని వీనులంబడియెఁ దా
మందంద నిశ్చేష్టులై
యనిమేషత్వము సిద్ధిఁబొందఁగని ము
న్నానాఁడు మారీచుఁడీ
ధ్వనియే చేసె నిదేమి చిత్రమని యు
త్కంఠన్ బ్రతీక్షింపఁగన్.

౪౦

॥ "అదిగో మహాదుఃఖ మాజ్వల్యముం బూని
రూపమ్ము గొని సేయు రోదనమ్ము
అదిగో ధరంగల్గు నఖిలకాలుష్యమ్ము
స్త్రీరూపమున సేయు నారవమ్ము

అదిగో నిఖిలదీన తౌత్సుక్య శక్తిగాఁ
యబలయై యొనరించు నార్తిరవము
అవిగో మహోఘమ్ము లందందుఁ జెలరేఁగి
యాకారమును బొంది యఱచుచుండె

॥ చూడరే యంచు దూరానఁ జూపె నొక్క
ముసలి ముత్తైదువును దుఃఖమున మునింగి
హృదయభేదనమ్మొనరించు నింతినంతఁ
గూలిపో సాగి రెల్లరు గుఱుతుఁ దెలిసి."

౪౧

॥ "హాయను, లక్ష్మణా యను మ
హాత్మ, దరిద్రుఁడు క్రోధమూర్తి యా
త్రేయుఁ డదేలవచ్చె జగ
తీవరు దర్శనమేలఁ గోరె నీ
వా యమధర్మరాజునకు
నడ్డము వోయితివేల తండ్రి, దీ
ర్ఘాయువు గోలుపోతివి గ
దన్న మహాటవికేలఁ బోయితో!"

౪౨

॥ అను నాయేడుపు బొమ్మను
వినుకలిచేఁ దడవి తడవి వెదకిన యంతన్
గనుగొని రెంతయు దీన
స్వనయై తము జేరవచ్చు సాధ్వీతలమున్.

౪౩

॥ అరరే నాతివసిష్ఠపత్నియగు న
న్యాయ్యంబదేమయ్యెనో
పరమశ్రేష్ఠ పతివ్రతాతిలక మీ
భంగిన్ మహాదీనతన్
స్మరియింపం గతమేమి లక్ష్మణుని నా
మంబీసరోజాక్షి దు
ర్భరమౌవార్త యిఁకేమిదెచ్చెఁగొగదా
పాపాత్ముఁడీ మౌనిపై॥

౪౪

॥ అనుచుం బుణ్యసతీ రో
దనమున దుర్వాసుఁగూర్చి తలతలవినియోన్
మునులెల్ల వానిఁ జేరం
జని ముట్టిరి పట్టిరతని సందడిసేయన్॥

౮౫

॥ వెఱ్ఱి బాగులవాఁడ వెంగిలివిత్తువీ
శ్రీకార్య మెవ్వాఁడు సెలవొసంగె,
వినుకలికంటివో విషవృచ్ఛమానీకు
గుడిపారుపత్తెమ్ము గూర్చె నెవఁడు
విసపాలవిత్తువో విడిముడీ నీ కిట్లు
వి ప్రకారము సేయఁజెప్పె నెవఁడు,
కాకోలమా, యిట్టి ఘాతుకకృత్యమ్ము
కైలాటసేయఁగా గఱపె నెవఁడు.
॥ ఏమి పనియుండి పోయితా యిసకులేశు
సాధమునకీవు పాపంబు సఁటుప నేఁడు
నిజముదాఁచినం బ్రాణాలు నిలువవింక
కోటి దుర్వాసుఁడము నిన్నె కూల్చఁగలము.

౮౬

॥ అనుచుం బెక్కురు చుట్టుముట్టి ముని న
త్యంతమ్ము పీడింపఁగాఁ
గని జాలింగొని నారదుండు వలికెఁ
గంభీర నాదంబునన్,

మునులారా, విధిచేఁత కేమనఁగనో
పుణ్ జూడ శ్రీరాముఁడే
తనపత్నిం గరుణించి గైకొనఁడిఁకన్
దాయాది రక్షించునా ?

౪౭

॥ అదె యాసాధ్వి వచించువాక్యములు స
త్యంబైనఁగానిందు పో
వుదమా తల్లియె పల్కునెల్ల నితసం
బోనిందు సద్బుద్ధి కా
స్పదమై వర్తిలునంచు నారదుఁడు సం
బాళించెనప్పోటు శాం
తి దయార్ద్రమ్ములు భక్తచిత్తములు తాం
తిన్మాని జీవించునే !

౪౮

॥ అనవుడుఁ జిత్తగించి ముని
లందఱుఁ జేరి రరుంధతీ సతిం
గనిరటుఁ గాంచినంతనె ని
గాథ విషాద తరంగపంక్తి యు

ష్పినఁగొన మానినీ హృదయ
భేదనమే యొనరించె; బంధు ద
ర్శనమున నిట్టిదెందు సహ
జంబెకదా! కవివాక్య సిద్ధికిన్.

౭౯

॥ అన్ననునమ్మి కూలి తక
టా యొకనాఁడు సుఖంబెఱుంగ వా
కన్నకుఁ దాళిగట్టితివె
కాని యిఁకంబయి మేలెఱుంగవో
యన్న, సుమిత్రకేమి యధి
కాదర మొప్పఁ గనిష్ఠపుత్రుస
భ్యున్నతి భద్రమయ్యె నెటు
వోయిన నేమిఁక నెవ్వఁడేనియున్.

౮౦

॥ అన్నాలక్ష్మణ, చిన్నిపాపవని ని
న్నాలించి లాలించి నా
కన్నారంగను ముద్దుగొన్నదిపుడే
కాదా మహాప్రీతి సం

పన్నా, పెండిలిచేసి యూర్మిళకు నీ
పాన్పిచ్చి యాశించుటల్
నిన్నా మొన్ననె కాద పిచ్చినిసుఁగా
నీకేల యీ దుర్గతుల్ !

౫౧

॥ అఱువదివేల యేండ్లకు మ
హాభర మొప్పఁగఁ గోరికోరి యా
దరమున మిమ్ముఁగాంచె నమి
తప్రియ మొప్పఁగ మూఁడునాళు లేక్
మురిపెముతోడఁ బెంచికొని
మోదమునందఁ డయూరె తండ్రికా
మరణము మంచికే కలిగె
మంగళముల్ కృశియించునాఁటికిక్.

౫౨

॥ మధుపర్కంబులు మాయవిప్పటికిఁ బ్రే
మల్పూచి పుష్పింప వా
వధువుంజూచిన గుండె బ్రద్దలగు స
ర్వప్రక్రియాస్ఫూర్తి నీ

ప్రథమారాధన సేయనున్నదకటా
పాపంబు శాంతింపఁగా
విధియింతల్ ఘటియించెనేమి కలదీ
విశ్వాన సత్యంబిఁకన్.

౫౩

॥ నిన్నగాక మొన్న నీరజాక్షి, నాదు
కన్నులెదుట నీవు కలిగినావు;
ఎంత ఘోరవార్త లింతలోపల వింటి
నినకులమ్మువారి యింటిలోన॥

౫౪

॥ కట్టా 'యేమని పల్కుదాన నెటులా
కన్యాలలామమ్ము నీ
నట్టేటన్ విడిపించిపోతి విపుడీ
నాఁడేని, కళ్యాణపుం
బొట్టే తాల్చుచునున్న దా రమణి కే
పున్నాపు నిన్నందఁగా
జిట్టీబొట్టు వ్రతమ్ము సల్పు నిటులీ
సేమంబు నీకయ్యెనా!

౫౫

॥ కానల కేఁగినాఁడు సతి
కై యొక మాటయుఁ జెప్పిపోవు; ని
ద్రానరకమ్ము సూపి యతి
దారుణమైన వియోగ వహ్నిలో
వేనలి వట్టి త్రోసితివి
వెఱ్ఱితనంబది యేమి తండ్రి! నీ
యాననమైనఁ జూపవల
దా యటుపిమ్మటనైన లక్ష్మణా

౫౬

॥ అకట తప్పుకున్నదయ్యె నాయొడలెల్లఁ
బులకరింత లంది కలఁగిపోయె ;
ఏమి నోటవచ్చు నిట్టి ఘట్టములందు
దప్పిఁజెంది నాల్క తడవడంగ. ॥

౫౭

॥ అనుచుఁ సాధ్వి యరుంధతీ రమణి యా
యా సంబునన్ బల్కుచుం
డిన యంతన్ జనుదెంచెఁ బూజ్యుఁడు తపో
నిష్ఠాగరిష్ఠుండు స

జ్జనసేవ్యుండు వసిష్ఠ మహాని పడఁతిన్
సాంత్వోక్తులం దేల్చి య
మ్మౌని లోకమ్ము వినంగఁ బల్కె నిటులన్
బున్నెంబు పెంపారఁగన్.

౫౮

॥ పుట్టిన నాఁటఁగోలె నొక
పుణ్యమొనర్పవె లక్ష్మణా, ఫలం
బుట్టి పడంగ నొక్కక్షణ
ముజ్జ్వల రాజ్యసుఖంబులందఁగాఁ
బుట్టవొ తండ్రికిం బ్రథమ
పుత్రుఁడవై కడగొట్టుపట్టివై
పుట్టవొ తల్లికీ తెఱఁగుఁ
బుట్టితివేమి యనిష్ట మక్కటా!

౫౯

॥ భరతుండెంతయు భాగ్యవంతుఁడు ధరన్
భద్రాసనాసీనుఁడై
పురమున్ వీడకె యష్టభోగముల సం
పూర్ణమ్ము గాఁబొందె నా

దర మొప్పంజననీ కటాక్ష మొక మా
త్రా పూర్ణమే నందవా
అర రే మంథర గర్భమైనఁ జారవ
య్యా కొంత మేలయ్యెడిఁగా.

౬౦

॥ పాయసం బానాఁడు పంచిపెట్టెడు వేళ
దశరథుండే పాటి దయవహించె.
కౌసల్య కర్ధమ్ము కైక కర్ధమ్మిచ్చి
మఱచె సుమిత్ర నా మనుజ విభుఁడు
అభిమానమును మాని యాచించెనా తల్లి
పాపలఁ గాంక్షించి భంగపడియె.
నీరె యిచ్చిరో లేక క్షీరమే యిచ్చిరో
యరిపేద బిడ్డల ట్లవతరించి
॥ రామ భరతులు రాజులై రాజ్యమేల
భ్రాతృభక్తులై నారు సౌమిత్రు లకట!
పుత్రకామేష్టి సలుపఁగాఁ బుట్టినట్టి
పూజ్యులిరువురే కాఁబోలు పుణ్యసుతులు ॥

౬౨

॥ తండ్రి కగ్రసుతుండు తగ దాశరథ నామ
ధేయుఁడై రాముండు శ్రేయమంట
కైకేయి కాతఁడే యేకైక సూనుఁడై
భరతుండు సర్వసంపదలఁ గాంచె
చెలువొప్పఁ దల్లికిఁ జిన్నబిడ్డం డౌట
శత్రుఘ్నుఁ డెంతయు సౌఖ్యమంద
తల్లి కగ్రజుఁడవై తండ్రికిఁ జిన్నవై
సౌమిత్రి యిటు నీవు జన్మమంది
॥ సౌధముల వీడి యడవిలో జన్మగడపి
సంపదల మాని దుఃఖమే చాలనంది
భ్రాతృసేవకై తాల్చితే ప్రాణచయము
లక్ష్మణా త్యాగమున కీవె లక్ష్యమగుచు.

౬౩

॥ రాముని. మాత్రమె యావి
శ్వామిత్రుఁడు గోర వాని జతసేయుటకై
సౌమిత్రి నంపె దశరథుఁ
డేమాత్రపు దొడ్డబుద్ధి యిరవుర నంపన్ !

౬౪

॥ రాముండే తనకూర్మి శిష్యుఁడని శౌ
ర్యస్ఫూర్తి నుగ్రాటవీ
సీమన్ రాక్షసకోటి రూపడఁచి ర
క్షించున్ దపోభూములు
ద్దామ ప్రౌఢిని శాంతి గూర్చునని వి
ద్యాసార్థ వారాశి వి
శ్వామిత్రుం డిడె వానికొక్కనికె స
ర్వాస్త్రమ్ములున్ శస్త్రముల్.

౬౫

॥ ఏమంత్రమ్ములఁ జెప్పిన
రామునకే చెప్పె నతఁడు రాముఁడె నేర్చెన్
సౌమిత్రి ప్రక్కనుండియు
నేమాత్ర మ్మాసుగొనఁ డయిచ్ఛాపరతన్.

౬౬

॥ తమ్ముఁడు వెంటవచ్చిన వి
ధంబు మదిం దలపోయఁ డెందు సీ
తమ్మును జూడఁగోరి నత
తమ్ము మునీశుఁడు సేయువర్ణనల్

సొమ్ములుపెట్టి రాముఁడల
సుందరికిన్ మనసమ్మొఁ గామ బీ
జమ్ములు సందడింప సహ
జమ్ముగ బుద్ధులు సన్నగిల్ల వే!

ఉ. ౭

॥ ఏమో తమ్ములకెల్లఁ గన్యకలఁదా
నిప్పించె శ్రీరాముఁడున్
ప్రేమల్ మీఱఁగఁ బెండ్లిచేసె ననుచుం
జేరొ్కందు రెంతేని ని
స్సీమోక్తుల్ వచియింపనేల నిజసం
సేవాభిలాషోద్ధతిన్
గామత్యాగి నొనర్చె లక్ష్మణుని తత్
కళ్యాణ పీఠమ్మునన్.

ఉ. ౮

॥ పెండిలి కూఁతులతో నిజ
మండలమున కేగునపుడు మార్గమునం దా
ఖండల విక్రముఁ డగు ను
ద్దండుండా పరశుధారి తారొ్కని నంతన్.

౬౯

॥ తనయందు లోపించు త్రైగుణ్యాశక్తులఁ
రాముండు పొందె నా రామునుండి,
పితృవాక్యపాలనాభీల ధర్మములెల్ల
రాముం డపహరించె రామునుండి,
స్త్రీరూపమునఁ బ్రేమ సిద్ధింప దనుమాట
రాముండు నేర్చె నా రామునుండి,
గండ్రగొడ్డలియె కోదండమాయెనటంచు
రాముం డెఱింగె నా రామునుండి,

॥ క్షాత్రమును జంపి బ్రాహ్మ్యమ్ము చల్లవడియె
రాజసం బింకఁ గూల్చు నీ రాక్షసమును
క్షాత్రధర్మమే రక్షింప సమయమగుట
రామనామరూపములు తార్మారులయ్యె.

౭౦

॥ అని యా పూజ్యుఁడు వల్కిన
మునిలోకము కుతుకమంది మోహముతో నా
ఘనుఁడగు నారదు నడిగెను
మునివర్యా యేమిచిత్రమో యటులయ్యెన్.

౭౧

॥ ఎన్నఁడుగాని భూమిపయి
నిట్టి విచిత్రము గల్గలేదు ము
న్నెన్నఁడు వెన్నుఁడీగతి మ
హిం గనుపట్టఁడు రెండురూపముల్
పన్నగ నొక్కచోట నిటు
భాసిలలేదొక పేరుమీఁద నే
పున్నెమొ రామరాముల య
పూర్వ కథాశ్రవణమ్ము తెల్పవే!

౭౨

॥ ఒకరూపము విడిచిన వే
ఱొకరూపముఁదాల్పఁ గలుగుటొప్పునుగానీ
యొక పేరున నిరురూపము
లొకచో నిటులంద నెట్టులొదవె ననంగన్.

౭౩

॥ అరయన్ శుద్ధము లాత్మబద్ధములు ని
త్యాపూర్వసంబంధ వి
స్ఫురితమ్ముల్ గుణదోషవర్జితములు
త్ఫుల్లప్రభాభావ భా

స్వరముల్ నిర్జిత దేశకాలములు శ
శ్వత్సౌఖ్యసన్మంగళా
కరముల్ రాముని నామరూపములు వి
ఖ్యాతమ్ములై యొప్పెడిన్.

౭౪

॥ ఏదో కాలమునందు సృష్టి ధరపై
నేయే గతిం జెందునో
ఆయా సృష్టికి నుత్తమప్రతిమయై
యాదర్శమై యొప్పు నా
మాయారూపుఁడు విష్ణుఁడీ తఱికిసీ
మర్త్యత్వముంబొందె ధ
ర్మాయాసమ్ము వహించె శిష్టజన సం
రక్షక్రియాదక్షుఁడై !

౭౫

॥ అని నారద ముని పల్కిన
విని సంతసమందిరెల్ల విస్మృతమతులై
ముని ముఖ్యుఁడు చెప్పందొర
కొనెఁ దచ్ఛేషమ్ము నిటులు గొమరొప్పంగన్.

౭౬

॥ ఎపుడో రాముఁడు కాలఁదన్నెఁదనునం
చీర్ష్యామతిన్ గైకకా
యుపదేశమ్మొనరించె మంథరయుఁ గ్రో
ధోద్రిక్తయై రామునిన్
విపినాంతర్గతుఁ జేసె నా భరతు ను
ర్వీ పాలుఁ గావించుచున్
విపరీత ప్రతికారధుర్య లకటా
విద్వేషిణుల్ మానినుల్!

౭౭

॥ రాముఁడొనర్చిన నేరము
రామునకే కల్గుఁగాక రామునితోడన్
సౌమిత్రి కానకేగుట
కేమున్నది దైవఘటనమే యటుగానీ!

౭౮

॥ కాంత వరాలు దీర్చుటకుఁ
గా రఘురాములఁ గానకంపె భూ
కాంతుఁడు వృద్ధరాజు నిజ
కాంతకుఁ గా రణమెంతొ సేసె శ్రీ

కాంతుఁడు రామచంద్రుఁడేఁక
గాంతను గింతను బీటఁద్రోలియే
కాంత మనోవ్యథల్ గుడువఁ
గానలకేగెను లక్ష్మణుండహా!

౭౯

॥ కల్లా కపటము లెఱుఁగక
యిల్లాలిని నిల్లువిడిచి యేకాంగియునై
తల్లిం దండ్రియుఁ గాఁదన
యుల్లంబిడి వదినె నన్న నొప్పఁగఁ గొల్చెన్.

౮౦

॥ ఎంత భజింపనేమి మను
జేశుఁడు రాముఁడు తృప్తిఁజెందునా
కొంతకుఁ గొంతయైనఁ దన
కుంగల సౌఖ్యము పంచిపెట్టునా
కాంత విహీన జానకియు
సౌఖ్య విహీనుఁడు లక్ష్మణుండ హా!
చింతయె రామభక్తులకు
జీవధనమ్మగునేమొ చూడఁగన్.

౮౧

॥ ఓరిమిఁగోలఁది పరీక్షా
భారము కడు హెచ్చుచుండు భక్తులసేవా
పారముఁ గొలువఁగ నీధర
శ్రీరాముని మించునధిక సేవ్యులు గలరే!

౮౨

॥ అని యీగతి నొక్కొక్కరు
మునులందఱుఁ దమకుఁ దమకుఁ బోలినరీతిన్
ఘనుఁడా లక్ష్మణుచరితము
వినుతించెడు లేశనొక్క విప్రుఁడు పల్కెన్.

౮౩

॥ మతిపోయెనేమి మీరీ
గతి రాముంగూర్చి పలుకఁగా ధర్మంబే
శతకోటి గలవు లక్ష్మణు
గతికింగల కారణములు గణుతింపంగన్.

౧౮

॥ తొత్తులమాటపై దశర
థుండకట కౌసలకంపెఁ బొమ్ము ప
ల్లెత్తి వచింపడన్న, తన
కెంత రుచించెనో తండ్రిమాట పి
చ్చెత్తిన వానిపోల్కిఁ దపి
యించె నితండు రణమ్ముసేసియుం
డెత్తును రాజ్యమిత్తునని
తీవ్రగతిన్ వచియింపఁగూడునే!

౧౯

॥ అతుల మహానుభావుఁడు ద
యామతి సాధువు రామమూర్తి నీ
గతి దయమాలినయ్యె ననఁ
గాఁదగునా మునిలోక మెల్లను
ద్ధతిఁ బదివేల రక్కసుల
దర్పమడంచిన యజ్ఞరక్షకుం
డతులిత దివ్యతేజుఁడు గు
ణాఢ్యుఁడు రాఘవుఁడౌ టెఱుంగరే!

౮౬

॥ భరతుఁడు పాదుకల్ గొనఁగ
భక్తిమెయిన్ వనసీమఁ జేర సం
గరమున కేగుదెంచెనని
గందర గోళముసేసె లక్ష్మణుం
డుఱుతర నిష్ఠురోక్తుల ర
ఘూద్వహుఁ జేరి వచింపనాతఁ డా
దరమున సత్యముం దెలిపి
ధర్మము దిద్దుట లీ రెఱుంగరే!

౮౭

॥ ఓరిమి లేదు బుద్ధినుప
యోగము సేయఁ డొకింతయేని సీ
తా రఘురాము లిద్దఱకు
దవ్వొనరింప సమర్థుఁ డెందుఁ గాం
తారములందు జానకి ని
తం డొకదా విడనాడి వచ్చె నె
వ్వార లెఱుంగరీతని ప్ర
వర్తన లెల్లను ద్వైధపూర్ణముల్!

౮౮

॥ ఏమీ జానకిపలుకుల
కామాత్రం బోర్వఁదగఁడెయంతకు నింతల్
సామాన్యమైన ఫలమా
రామామణిపట్ల నితఁడు రక్కసుఁడెకదా!

౮౯

॥ ఎఱుఁగఁడె రాక్షసబాధల
నెఱుఁగఁడె మారీచుమాయలే యువియంచున్;
ఎఱిఁగెఱిఁగి పిచ్చితల్లికి
వెఱవంగాఁదగునె యొంటి విడనాడంగన్.

౯౦

॥ రక్కసి ముక్కును జెవులుం
జెక్కిన నిష్కాముఁడనుచు సీతయెఱుఁగదా,
పెక్కేల యెచట దాఁకొని
రక్కసునిందోల రాదురమణిం బ్రోవన్ ?

౯౧

॥ శేషావతార మంచు వి
శేషమ్ముగఁబలికె నెవఁడొ శేషుని చదువుల్
శేషుని యోరిమిఁ జేర్కొని
దోషమ్ముగుఁగాదె యొరులతో నటుపోల్చన్.

క౨

॥ రాముఁడు నిర్వికారుఁడు ని
రంజనుఁడార్తిహరుండు సద్గుణ
స్తోముఁడు శాంతమూర్తి దయ
తో నొకమాటయుఁ బల్కకుండ నా
రీ మణికై యరణ్యముల
రేవగళుల్ వెదకంగసాగె సా
ధ్వీమణి జాడగానక మ
దిన్ వెగ డందుచు భీతచిత్తుఁడై!

క 3

॥ ఆనాఁడా కాకాసుర
పై నంతటి క్రోధియాటఁ బడఁతి యెఱుఁగదా
ఈ నాఁడీ లక్ష్మణు దెస
మానము వహియించు టెంత మహిత గుణంబో!

క౪

॥ వాలిం గూల్చెను రాజ్యమిచ్చెనను వి
శ్వాసంబుఁ బోనాడి యే
మేలుంగీడు తలంపడంచును కపిఁ మేటిం
గనంబోయి యు

ద్వేల ప్రౌఢిని దూఱె లక్ష్మణుఁడహో
ద్వేషించె నారామ భూ
పాలుండైనను గౌరవించెదు మహో
భక్తుండు సుగ్రీవునిన్.

౯౫

॥ చూచి రమ్మటన్నఁ జూచి రావలెఁగాని
కాల్చివచ్చుటొక్క ఘనతయగునె,
రామభక్తులైన రామునకే గొప్ప
పరుల నిటులఁ బల్కఁబాడి యగునె!

౯౬

॥ జానకిఁగాంచి రమ్మని ప్ర
శాంతముగా రఘురాముఁడంపన
మ్మానినిజూచి రక్కసుల
మాటొనరింపఁ దలంచి తత్పురిన్
వానర ముఖ్యుఁడగ్ని నిడె
వాలబలమ్మును వెల్లడింపఁగా,
వానికి వీనికిన్నదియు
వాల్గమొ కండె కదా తలంపఁగన్,

౯౭

॥ విష్ణుభక్తుఁడితఁడు విష్ణుండురాముండు
పరమతమ్ముఁ గూల్పఁ బ్రభవ మొందె
శైవుఁడంచు వాలిఁ జంపె నా సుగ్రీవుఁ
బ్రోచెఁ బ్రీతి సూర్యపుత్రుఁడనుచు.

౯౮

॥ శివుని వింటిని విఱిచె భార్గవుని వంచె
శైవభక్తులౌ రాక్షస సంఘమెల్లఁ
గూల్పఁ జన్మించెఁ గౌసల్యాకొమరుఁడితఁడు
విష్ణుమతము నిర్మింపఁగా విశ్వమందు.

౯౯

॥ లేకున్న రావణుండన
లోకములోఁ బాటి వాఁడె లోలత్వముచే
రాకాసియై వశించున
శ్రీకంఠుని భక్తుఁడగుటచే నటులయ్యెన్.

౧౦౦

॥ ఈశ్వరు మెప్పించి యీశ్వరింబడసి యా
మార్గమధ్యమునందె మఱపుగొందె,
కైలాసగిరి నెత్తఁ గాలుసేతులు నొచ్చి
పరమేశు నర్థించి భంగపడియె,
కార్తవీర్యార్జునుం గాల దువ్విననాఁడె
యంతకంతటి ఫలం బనుభవించె,
వాలిచేతంజిక్కి సోలి గర్వము దక్కి
ప్రాణాలతో నాఁడు బయటఁబడియె;

॥ వేదవేదాంగ విదుఁడు నిర్వేక మందె
భౌతికములకై యాధ్యాత్మ పథము దప్పె
బ్రహ్మసంతతి రావణ బ్రహ్మ యనఁగఁ
బరఁగు శివభక్తుఁడీతండు పాపియయ్యె.

౧౦౧

॥ భేదమున గుట్టువిప్పె విభీషణుండు
నాభి కలశమ్ము చూపించె నయముదక్కి;
వాలి రక్షించు సుగ్రీవుఁబోలె నితఁడు
భ్రాతృవిద్రోహియై రామభక్తుఁడయ్యె.

౧౦౨

॥ ధర్మమార్గమ్ము బోధించె ధాన్యమాలి
వేద విధి నిర్వహించె నా వేదవతియు
పాపమనుకొని రక్షించెఁ బార్వతమ్మ
సీతచేఁజిక్కి నసుర నశించుకొఱకు !

౧౦౩

॥ పోనిమ్మాతఁడు పుణ్యశీలలయెడన్
మోహంబు పాటింపఁగా
మానప్రాణము. లెల్లఁగోల్పడియె నా
మాన్యుండె తత్పూనుఁడే
మేనీ పాపమెఱుంగునే రణములో
నీల్గెంగదా లక్ష్మణుం
డే నీమంబున వానిఁగూల్చెఁ గలవే
యెందేని నీ ధర్మముల్ !

౧౦౪

॥ అల్లుఁడు శౌర్య రూపుఁడు మ
హారణకోవిదుఁ డింద్రజిత్తటం
చల్లమునం దలంపక భి
యుక్తుఁడు లక్ష్మణుఁడెంత సేసె సం

ఫుల్లగుణప్రకాశ నిజ
పుత్త్రి సులోచనకున్ విదగ్ధుఁడై
చెల్లున యామె తండ్రియగు
శేషుఁడితం డెయటంచుఁ బేర్కొనన్.

౧౦౫

రాముఁడు రాముని భక్త
స్తోమము రావణుని గూల్చి సుదతిన్ సీతా
రామామణిఁ గైకొని కడు
నేమం బొప్పంగఁ బురిసి జేరిన యంతన్.

౧౦౬

ఘనతన్ రాముఁడు సీతతోడ నభిషే
కంబంది సన్మంగళా
ర్చనలన్ శోభిలు చుండు వేళ సపహా
సస్ఫూర్తి మై నవ్వె నీ
ఘనుఁడా వానర భక్తకోటి హృదయా
ఘాతిం బొనర్చంగ దా
చను నే భక్తుల కిట్టిపాటు వలదే
సామ్రాజ్య మర్యాదయున్ !

౧౦౭

॥ పదునాల్గేఁడు లరణ్యవాసమున సం
ప్రాప్తింపకున్నట్టి దు
ర్మదవుం బెద్దమ యాశనేశ్వరపు ని
ద్రా దేవి యానాఁటికే
మొదవేఁ లక్ష్మణుఁడేల చేకొనియె నో
హో యూర్మిళా దేవి క
ల్లఁడెకాదే శివరాత్రి యాబ్రతుకు కె
ల్లఁ నాఁడె జాగారముఁ !

౧౦౮

॥ సరే పోనిమ్మటు రామచంద్రుఁడతి వి
స్తారమ్ము సంతోష సా
గర సాయుజ్యము సెందెనే పడఁతితోఁ
గళ్యాణ వంతమ్ముగా
మురిపెంబెల్లను దీర ముచ్చటగ నా
మూన్నాళ్ళు లేఁ గాని కా
పురముం జేసి సుఖించెనా మదతి కా
బుద్ధుల్ విధిప్రక్రియల్ !

౧౦౯

॥ కన్ను లొట్టవోయి కష్టాలు గట్టెక్కి
నాఁడె రామచంద్రుతోడఁ జేరి,
సుఖములందలేక సుదతి తానంతలోఁ
గోరనేల వీడుకోలు సలుప?

౧౧౦

॥ మునుల నెఱుఁగదొక్కొ, మునిపత్నులంజూడ
నంతకంటె మంచి యదను లేదె,
అకట స్త్రీలవాంఛలంత దారుణములా
విప్రయోగ కాంక్ష విప్పువేళ!

౧౧౧

॥ సరిగా నాఁటికె చాఁకలింటఁ దగవుల్
సంప్రాప్తమా యెట్లు ని
ద్దురవేళన్ జననోపు తద్భటుఁడు భ
ద్రుం డప్పుడే పోయి దు
ర్భర హీనోక్తులఁ దెచ్చు నెట్టు లవె శ్రీ
రాముండు సత్యంబకా
పొరపాటొందఁగనేల సీత నడవిన్
బోఁదోలఁ గాంక్షించుచున్.

౧౧౨

॥ ఇనకులేశు మదికి నీరెండ గాచెనో
పెద్దలూర లేని యద్దినమ్ము
దుర్దినమ్మొ యామె దొసఁగు మేలెఱుఁగని
యనుజవరులె మంత్రులైరి నాఁడు.

౧౧౩

॥ అల యరిష్టములకు నంగారకుండును
పాపములకు నెల్ల భైరవుండు
అభము శుభములోర్చు నాదిశేషుఁడయ్యె
లక్ష్మణుండు భార లంపటుండు.

౧౧౪

॥ అడవిఁ జానకి డించివచ్చు శుభ కా
ర్యం బాతఁడే మోవఁబా
ల్పడియెఁ బాపమొ పుణ్యమో సరిగ సం
భావింపఁగా నోడి, హా
గ్గడికాఁడై పసిపాపయై యబలయై
కన్నీరు మున్నీరుగా
విడిచెఁ సాధ్వికి రామునాజ్ఞ తెలుపఁ
వీర స్వరూపంబునఁ.

౧౧౫

॥ మానిని ముద్దరాలు నవ
మాసములుం జనినట్టి కాంత న
క్కానల నొంటిపాటున మృ
గమ్ముల బారికిం గ్రోలిపోవరా
మానుజుఁ డెట్టు లోర్చె నస
మాన దయా పరిపూర్ణ చిత్తుఁడై
మానవజన్మ మిన్ని యిడుమల్
భరియింపనె కల్గెనేమొకో!

౧౧౬

॥ సమయజ్ఞుం డఖిలార్థ వేది భగవ
త్సం కాశుఁ డార్యుండు సం
భ్రమశీలుండు చతుర్యుగ ప్రభవ ధ
ర్మజ్ఞుండు వాల్మీకి త
త్సమయోద్ధారకుఁడై సతీశుభ పరి
త్రాణంబుగావించె నా
శ్రమ వాసమ్మునఁ దండ్రియై మనిచె శ్రీ
రామ ప్రియాసక్తుఁడై !

౧౧౭

॥ లవకుశు లాహాయమ్మునకు
లంగరు వేసి బలమ్మునాపి ప్రా
భవమున లేఁదొడల్ సఱప
బంగరు తండ్రులఁ దానెఱింగియున్
బవరము సేయఁబిల్చిన య
భాగుఁడు లక్ష్మణుఁ డేమిసెప్ప నిం
కెవరు గలారు రామునకు
హెచ్చుగఁ గూర్చెడునట్టి బంధువుల్?

౧౧౮

॥ అన్న యెఱుంగకున్న వల
దా తెలుప న్నిజవంశకర్తలా
పిన్నలు పుత్త్రులంచు రఘు
వీరునితో వచియించి నంతలోఁ
జన్నదియేమి, యన్న యెడ
సత్యము దాఁపఁగనేల రాముఁడా
చిన్నల గుర్తెఱుంగునెడ
నేసలఁ జల్లి కవుంగిలింపఁడే!

౧౧౯

॥ జానకి సేమముం దెలుపఁ జక్కని
లాభమె సాక్ష్యమాయె భూ
జానియు వారు పుత్త్రిలని
సత్య మెంఱిగిన సత్త్వరమ్మె స
మ్మానముతోడ బాలకుల
మంగళ రూపుల నెత్తికొంచు ము
ద్దీని మొగమ్ము ముద్దుగొని
యెంతయు మోదమునందె నాతఁడున్.

* * *

౧౨౦

॥ వీరకులజులౌట ధీర సంపత్తియుఁ
దండ్రి బాసియుంట దైన్యవృత్తి
గోవుదూరమైన గోవత్సములరీతి
వారియందుఁ గోపఁ జేరఁదీసె.

* * *

౧౨౧

॥ ఆత్మ రూప గుణము లట్లట్లకాన్పించె
జానకీ విలాస సంగతములు
రామతేజమెల్ల రామునిలో నైక్య
భావ మందినటులఁ బ్రతిఫలించె!

౧౨౨

॥ స్వీయరూపమొక్క వీసమ్ముదప్పక
స్వస్వబాల్యమెల్ల సంస్మృశించు
తనయులిద్దఱందుఁ దాదాత్మ్యమందఁగా
రామచంద్రుఁ డాత్మరతిని దేలె!

* * *

౧౨౩

॥ తా మెఱుఁగని వాఁడును తల్లి కేఁగా
కీడొనర్చిన తెలుఁగు. మాటాడువాఁడు
తండ్రినని చెప్పికొనుచు ముద్దాడుచున్న
కపటి యోదార్పవారి కేకరణి ప్రియము!

* * *

౧౨౪

॥ రాత్రి యెల్లగాఢాంధకారమున మునిఁగి
భానుదర్శనోత్కంఠా ప్రపన్నయైన
ప్రకృతిరాగమ్ము సూర్యుఁడెబ్భంగిఁదాల్చు
తల్లిఋణము దీర్పఁగ బిడ్డవల్లనగునె!

* * *

౧౨౫

॥ సౌమిత్రి స్థితిఁ గోపమప్పటికి లే
శంబైన క్షీణించె నా
ధీమంతుండగు మునీశుండా సుదతి నెం
తే ప్రీతి రక్షింపఁగా
నేమయ్యెన్ ఫలమేమిదక్కెఁ దుదకా
యిల్లాలు క్రోధమ్ముతో
భూమాతృ గ్రహణమ్మునంద హరి సం
యోగంబు గాంక్షించుచున్.

౧౨౬

॥ మున్ను బోయ చంపఁ జన్న క్రౌంచములందు
నాత్మఁ జేరెఁ దొలుత నాత్మ విడిచి
ప్రకృతి పురుషులంగఁ బ్రథమ యేగెను నేఁడు
రామచంద్రువీడి రామ యేగె.

౧౨౭

॥ కలికాలమ్మది త్రేతలోఁ గలిగెఁ బ్ర
ఖ్యాత ప్రజోద్ధారకుల్
బలవంతుల్ పరమార్థ కోవిదులు ద
ర్పభ్రష్టులై ధర్మబ

ధ్ధులు పాపాత్ములచేతఁ జిక్కిరకటా!
దుర్వాసుఁడీ నాఁటికే
తలయెత్తెఁ దన దౌష్ట్యమెల్ల జగముల్
దర్శింప దుశ్శీలుఁడై !

౧౨౮

॥ మొదలే రాముఁడు దీనుఁడై ధరణిపై
మోహంబు చాలించి సం
పదలందూలి సతీవియోగమున శో
భాశూన్యుఁడై యుండ నా
పదలెల్లం గుమికూడి నొంచె బహుళా
పద్రక్షకుం డాతనిన్
మొదలే క్రుళ్లెను ధర్మవృక్షమున క
బ్బో పైనిఁ కేమయ్యెడిన్ !

౧౨౯

॥ ఆమహనీయరూపునకు
సంతిమ వార్త వచింపనేగ నే
మో మిడిమేల మొప్పఁగ య
ముం డటు పోయినవాఁడు పోక శ్రీ

రామునితోడఁ దాను నవ
రంగమునందు రహస్యమాడఁగా
నీమము తేర్పఱించెఁ గరు
ణింపక లక్ష్మణుఁ గూల్ప బుద్ధియై!

౧౩౦

॥ తాను మాటాడి పోయెడు లోన లోని
కెవ్వనింగాని రానిచ్చు నెవనికైన
మరణమే దండనమ్మనె మారకుండు;
ఎవ్వఁడా దుర్భరోద్యోగ మిచ్చగించు!

* * *

౧౩౧

॥ త్యాగమె జీవనమ్ము పర
తంత్రమున న్నిజయోషితా పరి
త్యాగమె భోగమై తనరు
దాశరథీశు పదార్చమాత్ర సం
భాగుఁడు లక్ష్మణుం డఖిల
భారవహుండయి ద్వారపాలకో
ద్యోగముదాల్చె నాఁటికిఁ బ్ర
యోగమెఱుంగని యస్త్రపాణియై!

౧౩౨

॥ సాగన్ లేదు నిమేషమైన నపుడే
సాక్షాత్కరించెన్ మహో
ద్వేగం బొప్పఁగఁ బర్వఁ బర్వనను నా
త్రేయుండు పోఁగోరెఁదా
నాగన్ లేఁడఁట రాముఁజూడఁ దరుణం
బై పోయెనం చచ్చటన్
మూఁగం బాఱెను గొంపముంచుకొని యే
మో పోయిన క్లింతయున్,

౧౬౩

॥ అదరించెన్ బెదరించె లక్ష్మణుని క్రో
ధావేశ మొప్పంగ దు
ర్మదుఁడై చూచెను గుడ్లగూబవలె నె
ఱ్ఱంజేసె నేత్రమ్ములం
దదకుల్ గాఁ బది పిల్లి శాపము లిడెన్
దర్పంబు చాలించి మే
లదనుం జేకొని కన్నుగప్పి యెటులో
యాత్రేయుడుం బోయినన్.

౧౩౪

॥ మౌనీశుని సభలోనికి
రానిచ్చిన నేరగాని రక్షింపక తాఁ
బూనిన సమయము చొప్పునఁ
గానలకుం బొమ్ము చావఁ గాలుఁడు కోరెన్.

౧౩౫

॥ అకటా! కానలకేగె లక్ష్మణుఁడు ధ
ర్మాద్వైతరూపుండు భ్రా
తృకఠోరాజ్ఞలఁ జిక్కి భక్తిహతుఁడై తీ
వ్రవ్రణోచ్ఛేద బా
ధకమౌ భౌతిక దేహము న్విడిచె శాం
తస్ఫూర్తి నత్యంత మో
హకలాశోభితుఁడై వెలింగె నిహ సౌ
ఖ్యభ్రష్టుఁడై నిష్ఠతోన్.

౧౩౬

॥ విష్ణుసేవచేసి విశ్వమే త్యజియించె,
భౌతికమ్ము మఱచి బ్రహ్మమెఱిఁగె,
రామగాథ నడపె రామానుజుండౌర
సహనమొందె యాత్మశక్తిగాఁగ.

* * *

౧౩౭

॥ ప్రతిదోషమ్మును ధర్మబద్ధమగుఁ బా
పంబెల్లఁ బుణ్యమ్మె, సు
వ్రతుఁడేదే నొక చిన్నధర్మమును సం
రక్షింపఁగాఁబూని ప్రా
కృత సంకల్పముచే నొనర్చు క్రియయే
కీడైన మేలైన దు
ర్గతుఁడౌనే యతఁ డంత మాత్రమున లో
కంబెల్ల దూషింపఁగన్?

౧౩౮

॥ అనునా విప్రుని యుక్తుల
వినినంత వసిష్ఠమౌని వేగిరపడుచున్
ముని తల్లజు లందఱతోఁ
బనివడి యీ క్రిందివిధము పలుకదొడంగెన్.

౧౩౯

॥ ఘనులారా, ఘటికాత్రయమ్మె కలవిం
కన్ మీకు మాకెల్ల రా
ముని దర్శింపఁగ రండు సత్వరము; మ
మ్మున్నిమ్ము గాపాడు సన్

మునిలోకోద్ధరుఁ డాప్తబాంధవుఁడునౌ
భూపాలుఁ డాతండు నేఁ
డనుజుం డీగతి ద్రెళ్లు వార్తవిని రూ
పాభాస ముంజెందఁడే!

౧౪౦

॥ రాజును రక్షకుండు రఘు
రాముఁడు దేవుఁడు వాని సేమమే
తేజముగూర్చు నెల్లరకు
దేవుని మెల్లయె భూమి చల్లనౌ
రాజుల మేటిపాలన ధ
రామర గోతతి కెల్ల సేమమున్
భూజన సర్వసౌఖ్య శుభ
ముల్ సమ ధర్మ పథంబుఁ గూర్చదే!

౧౪౧

॥ రావణ కుంభకర్ణులవు
రా యపుడే పరరూపమంది ధా
త్రీ విపనాంత జాతులయి
తీవ్ర విష ప్రదులైన వార్తలే

వో వినిపించుచున్న వవి
గో యిఁక రాముఁడు బాలకృష్ణుఁడై
పావన మూర్తియై ధరను
పాలన సేయుఁ గృపావిశాలుఁడై !

౧౪౨

॥ అవిగో సృష్టి వినాశకర్మలు సుర
వ్యాపార సంకీర్ణ సం
భవ సంరబ్ధుడు భారతీపతి మహా
భాస్వంతుఁడై యల్ల దే
భవునింగూడి చరాచరాళి సృజన
ప్రారంభ పారీణుఁడై
భువన ప్రాపకుఁడయ్యెఁ దద్విలయ సం
ఫుల్ల క్రియా దక్షతన్.

౧౪3

॥ వైకుంఠాలయ మల్లదే తెలిచిరా
వాద్యధ్వనుల్ వింటిరే
శ్రీకాంతుండటు వచ్చునంచుఁ దెలుపన్
జేజేలు ఘంటా ధ్వనుల్

ప్రాకారమ్ములదాఁటి యీ త్రిభువన
ప్రాకారముల్ మీఱె నా
శ్రీకారమ్ముల కర్థమేమొ తెలియన్
శ్రీరాము దర్శింపుఁడీ!

౧౪౪

॥ మనగతి యేమి సేయునొ ర
మాపతి వేగమ పోయి పాదుకల్
మునుకొని మ్రొక్కి వేడుకొనఁ
బొందు మునీశ్వరులార, యింక నే
మనుకొననేమి యావల మ
హాత్ముఁడు రాముఁడు ప్రోవకున్న నీ
జననములెల్ల వ్యర్థము ల
సంగతముల్ హరిభక్త కోటికిన్.

౧౪౫

॥ అదుగో రాముఁడువచ్చె నీదెసకు సౌ
ఖ్యానంద సంధాయియై
పదుఁడీ పాదములంటుఁడీ యడుగుఁడీ
పాపాత్మ సంఘంబునే

మడువుం ద్రోయునో, యేమిసేయ మనునో
మర్యాద చాలించి నిన్
విడువన్ లేమని వెంట దోడుకొని పో
వేయంచుఁ బ్రార్థింపుఁడీ !

౧౪౬

॥ అని వసిష్ఠుండు పల్కెడు నంతలోనఁ
బుడమి యొడయఁడౌ రాముండు పొడవుసూపె
నెంతో సంభ్రమంబున మును లెల్లఁ జేరి
దేవ దేవుఁడౌ ప్రభునిఁ బ్రార్థించి రిటుల.

౧౪౭

॥ రావయ్యా రఘురామ చంద్ర, ధరణీ
రాజన్య చూడామణీ
ప్రోవంగా సమయమ్మువచ్చె వినుమో
పుణ్యాత్మ, మా కెల్ల నే
త్రోవం జూపెదొ, యేమొ, యావు సను నా
త్రోవేకదా దూడకున్
గావంగా దయసేసి మాదు బరమై
కాంత్యమ్ము దర్శింపవే !

౧౪౮

॥ కామితమేమి లేదు కల
కాలము నీ రమణీయరూపమే
నామది నిల్పుమయ్య రఘు
నాథ, సుధారస మంద్రుగాని నీ
నామము చేదువుట్టెను క
నంబడకుండెడు బంధునామ మే
లా మదినెంతయుం జెఱచు
నక్కట రూపము మోజుదీర్పఁగన్?

౧౪౯

॥ త్రేతకు జాతక మ్మొలయఁ
దీర్చిన మాని వసిష్ఠుఁడేమొ పెం
జేతర సేయునేఁ డిచటఁ
జక్కఁగ నర్థముగాదు తండ్రి, యే
మో తకరారు వచ్చెనఁట,
పుణ్యమొ పాపమొ సన్నగాండ్ర మ
య్యా తెలుపంగదయ్య తమ
యందరి సేమము లొక్కఁ పెట్టునన్.

౧౫౦

॥ కళలంబాసిరి బ్రాహ్మణోత్తములు శ్రీ
కంఠమ్ములన్ దుఃఖమే
వెలసె న్నేఁటికి గోవులెల్ల సనియెన్
విశ్వేశ వేలాఋలం
దలఁపించుంగద శాంతి చచ్చె నన వి
ధ్వంసంబు దీపింపఁగన్
విలయంబప్పుడె కల్గెనేమి యటులీ
విశ్వమ్మె పోఁజాలినన్.

౧౫౧

॥ అనలకులమ్మాయె నినకులం బిపుడాయె
జన్మింపు మిఁకమీాదఁ జంద్రునింట.
బ్రాహ్మ్యమ్ము క్షాత్రమ్ము బడిసివాటునఁ బోయె,
యాదవకుల మింక మీాఁదఁగలదు
బ్రహ్మచర్యము నేకపత్నీ వ్రతము లాయె
వేలార్లు సతులతో వెలయు మింక
పరశు కోదండమ్ము లెరువుసొమ్ములు నీకు
శంఖచక్రములె సత్సౌఖ్యమొసఁగు

౧౫౨

॥ పాప తరుకోటి నాటి కాపాడి తుదకుఁ
బండుటదనులోఁ బరశు హస్తుండవగుదె,
జ్ఞానదీపికల్ వెలుఁగు పుణ్యమ్ము లొసఁగి
రమ్ము రక్షింప మమ్ము శ్రీరామచంద్ర.

౧౫౩

॥ అని వేఁడ రాముఁడాదెస
మునులెల్లరఁ గనుచుఁ గరుణ ముప్పిరిగొనఁగా
ననె నో మునులారా వే
చేనుఁడీ యా గంగలోన స్నానములాడన్.

౧౫౪

॥ మీ రెల్లరు స్త్రీ దివ్యా
కారములం జెంది గోపికలరై నన్నున్
గారాబమొప్పఁ గొలుతురు
నారదముని కథలనెల్ల నడిపించు నిఁకన్.

౧౫౫

॥ అని సెలవిచ్చిన రామునిఁ
గని యానందమునఁ బాదకమలాశ్లేష
మ్మొనరించి భక్తిసల్పిన
మునిజనముల కాతఁడిటుల ముదమునఁ బల్కె౯.

౧౫౬

॥ స్త్రీరూపమె సత్సౌఖ్యా
ధారము ప్రేమాతిరేక ధర్మనిరూఢా
కారమ్మగు శ్రీకరమౌ
స్త్రీరూపమునందె భక్తిసిద్ధింపఁదగు౯.

౧౫౭

॥ భక్తియొకండు చాలు పరి
పాటిగ మీకు లభించెఁ గొంత నా
సక్తివహించి నాయెడల
సాధుతపస్సుల సల్పినారిఁక౯
రక్తిమెయి౯ భజింపుఁడి ధ
రాభరమెల్లను నేనతాల్తు స్త్రీ
శక్తి నొకండు చేతఁగొని
శక్తుఁడనై పరిపూర్ణబుద్ధినై!

౧౫౮

॥ యతులుం బ్రాసలు లేని శుష్క పురుషా
ఖ్యాతమ్ముగుఁ గార్దభ
శ్రుతి సౌఖ్యమ్మొగి నంగనామధుర సు
శ్లోకోక్తి గీతమ్ము ప్ర
స్తుత రమ్యంబగు కోకిలారవళి; భ
క్తుల్ కామినుల్ పాడు వి
స్తృత గీతమ్ము కళాప్రపూర్ణ మది యెం
తే నాకు మోదంబిడుఁ.

౧౫౯

॥ అనుచుఁ రాముఁడు పల్కుచుండఁగనె వే
యంతంతలో మాఱుపుల్
జనియించెఁ దెలవాఱెఁ దూరుపు మహా
సంతోష సంరంభముల్
వినవచ్చెఁ బలరామకృష్ణు లపుడే
విజ్ఞాత శౌర్యక్రియా
ధనులై దేవులవోలెఁ బుట్టిరను వా
ర్తల్ దైవసంకీర్తనల్ !

౧౬౦

॥ ఆనందంబున దేవతల్ వెలుఁగ భ
క్త్యావేశ సంసక్తలౌ
మానుల్ చేతుల నత్తి మ్రొక్కులిడ బ్ర
హ్మల్ రుద్రదిక్పాలకుల్
ధ్యానారాధన లాచరింప నిఖిల
వ్యాపారముల్ మంగళ
ధ్యానోదీర్ణములై చెలంగ శుభ సం
ధానమ్మునం బొంగుచున్.

మంగళం — మహత్.

శ్రీ. శ్రీ. శ్రీ.

Printed at the B. N. K. Press, Madras—for Q. H. Ms. 121.

# తప్పొప్పులు



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 15 | 10 | వేదు | వేఁడి |
| 28 | 10 | పుత్రు | పుత్త్రు |
| 32 | 10 | ,, | ,, |
| 33 | 15 | ,, | ,, |
| 34 | 1 | దాశరధి | దాశరథి |
| 42 | 8 | లేశ | వేళ |
| 43 | 3 | వచింపడన్న | వచింపఁడన్న |